Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ ఆగస్టు నెల 21 వ తేది శుక్రవారం [నె 33 రు.

## లండనుకు వేంచేసిన జర్మను ప్రముఖుడు



ఇతడు జర్మను నౌకాదళమునకు చెందిన ప్రముఖుడు. క్షేమంగా లండను చేరినాడు. బ్రిటిష్ సైనికుల పహారాతో సహా చేరినాడు. సముద్రంమీద యుద్ధ ఖైదీగా పట్టుకోబడినాడు. యుద్ధ ఖైదీల మకాముకు తన సంచీ సామగ్రితో సహా వెళ్లుచున్నాడు. అతడు లండను నగరంలోని ఒక రైలు స్టేషనులో దిగి పోవుచుండగా, యీ ఫోటో తీయబడెను.

# ప్రస్తుత రాజకీయ వ్యవహారములు.

## రావు బహదూరు యం. సి. రాజాగారు,

(అఖిల భారత నిమ్నజాతుల మహా సంఘాధ్యక్షులు.)

ఒకవైపున శత్రువులు తూర్పునుండియు, పడమటనుండియు గూడ ఇండియామీదకు దండెత్తివచ్చుటకు సిద్ధముగానున్న యీ ఉపద్రవకర సమయంలో, ఇండియాలోనుండి బ్రిటిష్ గవర్నమెంటువారిని వెళ్లి పోవలసినదని కాంగ్రెసు కమిటీ తీర్మానము చేసింది. కాంగ్రెసు మహాసభ అవలంబించిన యీ ధోరణిచూస్తే, దాదాభాయి నౌరోజీ, సురేంద్రనాధ బెనర్జీ, జి. సుబ్రహ్మణ్య అయ్యరు మున్నగువారు పోషించి వృద్ధిలోనికి తెచ్చిన కాంగ్రెసు మహాసభ లాగున నేటి కాంగ్రెసు కన్పించుటలేదు. లోకమాన్య తిలకుగాని, గోపాలకృష్ణ గోఖ్లేగాని యీవిధంగా కాంగ్రెసును నడిపించలేదు. డాక్టరు ఆనీబీసెంటమ్మ తన "హోం రూలు" ఉద్యమమును కూడా యిటువంటి తత్వంలోకి దింపియుండలేదు. సక్రమంగా బాధ్యతాయుత స్వపరిపాలన యీ దేశంలో వికసించి వృద్ధిపొందవలెననిన్నీ, గవర్నమెంటువారి వ్యవహార పద్ధతులను సత్ప్రయోజనకరంగా విమర్శించవలెననిన్నీ, ఆ కాంగ్రెసు నాయకుల సంకల్పంగా ఉండెను. వారి ముఖ్య సంకల్పమేమిటంటే, గవర్నమెంటుకు తోడ్పడి గవర్నమెంటును సక్రమంగా నడిపించవలెననియే. ప్రభుత్వమునకున్నూ, ప్రజలకున్నూ భేదభావం లేకుండా, అన్యోన్యంగా ఉభయులూ ఏకమై యుండేటట్లు చేయవలెనని వారి సంకల్పమై యుండెను.

ప్రజల కోరికలను, ప్రజల అభిప్రాయ తత్వములను గవర్నమెంటువారు గ్రహింపగల్గుటకై, అట్టి ప్రజాశయములను ప్రకటించగల మహాసభగా యీ కాంగ్రెసుసభ ఏర్పడవలెనని డఫ్రిన్ ప్రభువు (అప్పటి వైస్రాయి) కాంగ్రెసు సంస్థయొక్క ప్రయోజనమును నిర్వచించెను. అటువంటి కాంగ్రెసు మహాసభ ఒకటి ఉండవలెనని ఆయన సూచించెను. ఇండియాలో సివిలు సర్వీసు ఆఫీసరుగా పనిచేసిన ఆంగ్లేయుడగు ఏ. సి. హ్యూముగారు అహోరాత్రములు కష్టించి కృషి చేసి యీ కాంగ్రెసు మహాసభను ప్రారంభదశలో పోషించెను. సర్ విలియం వెడ్డరుబర్నుగారు కాంగ్రెసు మహాసభకు నాయకులుగానుండి దానిని నడిపించిరి. చార్లెసు బ్రాడ్లావంటి బ్రిటిష్ రాజకీయ నాయకులు యీ సభకు సదుపదేశకులుగా నుండిరి.

**బ్రిటీష్‌వారు భారతీయులు కలిసి పరస్పర సహకారులై పని చేయవలెననే విషయం కాంగ్రెసు మహాసభకు ప్రధాన మూలసూత్రముగా నున్నది**

కాని గాంధిమహాత్ముడు నాయకత్వం వహించిన పిమ్మట, .గవర్నమెంటుతో సహాయ నిరాకరణం చెయ్యడమే ఒక గొప్ప సద్గుణమనిన్నీ, అదే కాంగ్రెసుయొక్క మూలతత్వమనిన్నీ బోధించుట సాగించాడు. గాంధీజీ యీ సహాయ నిరాకరణ పద్ధతిని అవలంబించుటవల్లనే, మనకు 1935 వ సంవత్సరంలో లభించినట్టియు ప్రస్తుతం అమలులో నున్నట్టియు ఇండియా రాజ్యాంగ చట్టమునందు మనము కోరినంత విశాలాధికారములు మనకు లభించలేదు. ఈ సహాయ నిరాకరణ తత్వం యిప్పుడు బాగా ముదిరినది. కాంగ్రెసు మహాసభయొక్క ప్రతిష్ఠాపకుల సంకల్ప ప్రయోజనములకు యీ తత్వం పూర్తిగా ప్రత్యక్ష విరుద్ధంగా ఉంది. "బ్రిటిష్ వారు ఇండియా విడిచి పోవాలి" అనే పాట పాడుటవల్ల సహాయ నిరాకరణ తత్వం పూర్తిగా కొండెక్కినది.

బ్రిటిష్‌వారు నూతన సంస్కరణములను భారతదేశ రాజ్యాంగ పద్ధతులలో కాలక్రమేణ చేయుచుండవలెనని సంకల్పించుకొని ఇంతకాలం నుంచీ ఆ ప్రకారంగానే వ్యవహరిస్తూ వచ్చారు. బ్రిటిష్‌వారి సంకల్పానుసారంగా కాకుండా, గాంధీజీ సాగించిన ఉద్యమంవల్ల ఎక్కువగా సాధించినది ఏమిన్నీ లేదు. బ్రిటిష్ వారు చేయదలచుకొన్న సంస్కరణములను వారు చేసి, నూతన అధికారములను యివ్వదలచినంత వరకు యిచ్చియున్నారు. కాని, గాంధీజీ తన ఉద్యమమువల్ల, ఎవరో కొందరు బ్రిటిష్ రాజకీయ వేత్తలను కొంచెం బెదరకొట్టియుండవచ్చు.

అహింసాతత్వం అవలంబించుచున్నానని పైకి జెప్పి, భారతీయుల నందరిని ప్రభుత్వంమీద తిరుగుబాటు చేయడానికి పురిగొల్పేటటువంటి విప్లవకారుడు యీ గాంధీజీ. పైకి శాంతమూర్తియైన మహా యోగిలాగున నటించేటటువంటి విప్లవకారుడు. "భారతదేశ రాజకీయ వ్యవహారములలో గాంధీజీ చాలా పెద్ద సంక్షోభకారకుడు" అని డాక్టరు ఆనీబీసెంటమ్మ చెప్పిన మాట నేటికి ఋజువగుచున్నది. ప్రజల నందరినీ మహాసంక్షోభమునకు ప్రేరేపించి, దేశంలో అంతఃకల్లోలములు పుట్టించి, యీ దేశాన్ని జపానువాళ్ల సులభంగా మింగివేయడానికి అవకాశం కలుగజేస్తున్నాడు. ఇటువంటి సంక్షోభంవల్ల కలిగే ఫలితం యీ సంక్షోభకారకులైన నాయకులకు తెలియును. కాని, దేశంలోని జనులకు వారు అది తెలియనియ్యలేదు.

బ్రిటిష్‌వారికి జపానువాళ్లు శత్రువులనిమాత్రం భారతీయులు గ్రహించారు. భారతీయులకు కూడా బ్రిటిష్‌వారు శత్రువులనియే యీ కాంగ్రెసు నాయకులు భావించారు. కాని జపానువాళ్లు భారతీయులకు మిత్రులు కారని యీ నాయకులకు తెలియును. అయినప్పటికీ, జపానువాళ్లు యీ దేశంలోకి వచ్చినట్లయితే, అందువల్ల భారతదేశాని కేదో కొంత లాభిస్తుందని ఆశపడుతున్నారు. కనుక, గాంధీజీయొక్క ఒత్తిడికి బ్రిటిష్‌వారు యీ రోజున మెత్తపడి లొంగిన యెడల, భారతదేశాన్ని జపానువాళ్లకు ఒప్పగించినందుకై భారతీయులే బ్రిటిష్‌వారిని ఉత్తరోత్తర అనేక విధాలుగా నిందించగలరు.

ప్రస్తుతం దేశంలోని ప్రజలందరూ బ్రిటిష్‌వారిని ఎదిరించి పోరాడుట బాగా సాధకం చేసినట్లయితే, జపానువాళ్లను ఎదిరించగల శక్తి సామర్థ్యంకూడా ప్రజలకు ఏర్పడగలదని కొందరు కాంగ్రెసువాదులు అనుచున్నారు. ధిక్కారభావం అనేది ఎవరిమీద చూపించుచున్నామనే విషయంతో నిమిత్తంలేకుండానే ధిక్కారభావం ప్రయోగించడం సాధ్యమవుతుందా! అటువంటిది అసహజం—అసంభవం. బ్రిటిష్‌వారిని ఎదిరించడమే, జపానువాళ్లకు సహాయంచేయడం అవుతుంది. ఈ ధర్మసూక్ష్మములన్నీ తెలిసిన వాళ్లు కూడా, యీ రీతిగా ప్రజలను మభ్యపెట్టి యిటువంటిసంక్షోభంలోనికి దింపడం చాలాఅన్యాయం.

## కాంగ్రెసు దేనికొరకు పోరాడుచున్నది?

కాంగ్రెసువారు దేనికొరకు పోరాడుచున్నారో అర్థమగుటలేదు. సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వడానికి బ్రిటిష్‌వారు ఒప్పుకొని వాగ్దానం చేశారు. అట్టి స్వాతంత్ర్యాధికారంలో చాలా భాగం యివ్వబడియున్నది. "భారతదేశానికి స్వపరిపాలనాధికారం యిస్తాము" అని అఖిల ప్రపంచము యెదుట బాహాటంగా వెల్లడించి మాట యిచ్చి ఒప్పుకొనియున్నారు. అటువంటి ప్రమాణవచనములనుకూడా నమ్మనటువంటివారికి, చెప్పిన ప్రకారంగా చేయడం అంటే ఏమిటో తెలియదు. వారు అటువంటి అలవాటు, అటువంటి తత్వము లేనివారై యుండుటవల్లనే తెలియదు. బ్రిటిష్‌వారి మాటలయందు ప్రజలకు నమ్మకముపోయినదనిన్నీ, అందువల్లనే ప్రజలు ఆందోళన చేయుచున్నారనిన్నీ చెప్పుచున్నారు. కాని, అది వట్టి కపటనాటకం. వారికి ఒక లక్ష్యం ఏదో మనస్సులో ఉన్నది. అటువంటి రాజకీయ సంకల్పం ఏదో సాధించుటకొరకై, బ్రిటిష్‌వారి మాటలను నమ్మజాలమనే కపటభావమును నటించి యీ ఆందోళన సాగించుచున్నారు.

స్వరాజ్యము ఇంకా మనకు లభించకపోవుటకు ఆటంకము మనలోనే ఉన్నది. ప్రపంచంలో భారతీయుని మాటకన్నా, ఆంగ్లేయుని మాటకు ఎక్కువ విలువ ఉన్నది. నేడు మనకు స్వపరిపాలనాధికారం కావాలి. కాని, యీ అధికారమును మనలో ఎవరికి ఒప్పగించవలెను? గాంధీగారికిన్ని ఆయన అనుచరులకున్నూ ఒప్పగించవలెనా? వారి కివ్వబడిన అధికారమును వారు సక్రమంగా నిర్వహించగలరని మనము నమ్మియుండగలమా? మనలో మనకే అపనమ్మకము ఎక్కువగా ఉన్నది. మనలో మనకు అయికమత్యం సరిగా లేదు. ఇది అసత్యమనుటకు వీలులేదు. మనలో మనకు అయికమత్యం లేకపోవుటవల్లనే మన కింకను స్వరాజ్యం రాలేదనే విషయం గాంధీగారుకూడా ఒప్పుకొనియున్నారు. కాని ఆ మాటను బ్రిటిష్‌వారు అన్నట్లయితే, ఆయనకు ఎక్కడలేని కోపం వస్తుంది. "ఆ మాట అనడానికి మీరెవరు?" అని ఆయన బ్రిటిష్‌వారిమీద ఆగ్రహించుచున్నాడు. "మీరు యీ దేశంనుంచి వెళ్లిపోతేనేగాని,

మాలో మాకుగల విభేదాలు తొలగిపోవు. మీరు వెళ్లిపోతే, అన్ని పార్టీలవారూ అన్ని మతాలవారూ ఏకీభవించేటట్లుగా మేము చెయ్యగలము" అని ఆయన వాదించుచున్నాడు. ఆయన ఆ ప్రకారంగా వాదించుచున్నాడేగాని, మనలో ఉన్న విభేదాలు అంత సులభంగా తొలగిపోగలవా? తొలగిపోవుటకు ఎంత కాలం పట్టును? అంతవరకు జపానువారు మనమీదికి దండెత్తి రాకుండా ఆగుతారా? అంతవరకూ, ప్రజావిశ్వాసం లేనట్టియు, ప్రజల తరఫున బాధ్యత వహింపజాలనట్టియు కొందరు పెద్దలకు మాత్రమే ప్రభుత్వాధికారమంతయును ఒప్పజెప్పబడవచ్చునా? ఇవి చాలా ముఖ్యంగా ఆలోచించవలసిన విషయాలు.

## స్వరాజ్యం అంటే అధికారమే కాదు — బాధ్యత కూడా.

స్వరాజ్యం అంటే మన అధికారం మన చేతులలోకి రావడమే అని భ్రమపడకూడదు. అధికారం వహించేవాళ్లు చాలా గొప్ప బాధ్యతలు కూడా వహించాలి. బ్రిటిష్‌వారు యీ దేశాన్ని రక్షించుట విషయంలో విశేషమైన బాధ్యత వహించియున్నారు. ఈ దేశంలోని 40 కోట్ల జనమును రక్షించవలసిన బాధ్యత వహించియున్నారు. నేల మీదను, సముద్రం మీదను, ఆకాశంలోను మూడు విధాలుగా శత్రువుతో యుద్ధం చెయ్యవలసియున్నది. మన భారతదేశ రాజకీయ నాయకులలో ఒక్కడైనా యీ త్రివిధ యుద్ధతంత్రం ఏవిధంగా సాగించవలెనో గ్రహించి నేర్చినవాడు ఉన్నాడా? యావద్భారత జాతీయ తంత్రం ఒక్కరీతిగా ఏకముఖంగా నడిపించుట ఎటువంటిదో మన కింకా అలవాటు కానేలేదు. ఎవరి రాష్ట్ర వ్యవహారాలు వారు చూచుకొనుటవరకే అలవాటు పడియున్నాము. అటువంటి సందర్భములో, అంతర్జాతీయ వ్యవహార దృష్టి మనకు ఏవిధంగా ఏర్పడగలదు? అంతర్జాతీయ వ్యవహార తంత్రంతో యుద్ధ వ్యూహములను నడిపించవలసియున్నది. ఇప్పుడు జరిగే మహాసంగ్రామం ప్రపంచమున కంతకున్నూ సంబంధించిన అఖిల రాజ్య సమష్టి యుద్ధంగా వున్నది. ఇటువంటి సందర్భంలో, బ్రిటిష్‌వారున్నూ, ఆమెరికావారున్నూ, యీ మహాసంగ్రామమువల్ల కలిగేటటువంటి ఘోరదురవస్థలు ఇంతవరకూ భారత దేశానికి సంభవింపకుండా భారత దేశాన్ని కాపాడుచున్నందుకు వారికి భారతీయులమైన మనము కృతజ్ఞతా బద్ధులమై యుండవలెను.

"జపానువారు యీ రోజున ఇండియాలోకి ప్రవేశించినట్లయితే, మేము అహింసావ్రత నిరతులమై శాంతమూర్తులమై స్తంభించి ఉంటాము" అని వాదించుచున్న పార్టీవారికి యీ రోజున దేశ పరిపాలనాధికారమును ఒప్పగింపజాలము అని బ్రిటిష్‌వారు నిరాకరించారు. ఇదే బ్రిటిష్‌వారు చేసినపని. కాంగ్రెసు పార్టీవారు గవర్నమెంటుకు ఎంత ప్రతికూలంగా ఉన్నప్పటికీ, యుద్ధ సంబంధమైన కార్యాలలో పనిచేయుటకు, భారత దేశ మంతటను విశేషంగా జనులు వచ్చి చేరుచునేయున్నారు. కాబట్టి కాంగ్రెసు పార్టీవారు గాక, దేశంలోని తదితర పార్టీలవారందరునూ బ్రిటిష్‌వారికిన్నీ మిత్రరాజ్యాలవారికిన్నీ తోడ్పడి పనిచేయుచున్నారనే విషయం విశదమగుచున్నది. మిత్ర రాజ్యాలకు భారతదేశం తోడ్పడుట లేదనే మాట వట్టి బూటకం.

కనుక, ఇప్పుడు దేశంలో గవర్నమెంటువారికి తోడ్పడి పనిచేయుచున్న పార్టీల తరఫు ప్రతినిధులనందరినీ గవర్నమెంటువారు సమావేశపరచవలెను. గవర్నమెంటుకు సహాయ నిరాకరణం చేయుచున్న పార్టీవారిని పిలువనక్కరలేదు. సహాయకారులైన పార్టీల నాయకప్రముఖులను ఒక ప్రభుత్వవర్గంగా ఏర్పాటు చేయవలెను. అటువంటి ప్రభుత్వ కార్యవర్గము కాంగ్రెసు పార్టీకన్నా ఎక్కువ ప్రజాప్రాబల్యము కలదై అధికారం వహించి వ్యవహరించగలదు. ఈ విధంగా ప్రభుత్వాధికారవర్గమును ఏర్పాటు చేయుటవల్ల దేశంలోని యీ సహకార పక్షముల ప్రభావం బోధపడుతుంది. అంతే కాకుండా యీ ప్రత్యక్షావకాశములను గవర్నమెంటువారు సవ్యంగా వినియోగించుకొనినవారయ్యెదరు. కాబట్టి గవర్నమెంటువారు ఏవో కొన్ని సిద్ధాంతములను పట్టుకొని ప్రాకులాడకుండా, రాజీపద్ధతులకొరకై ఆలోచిస్తూ కాలహరణం చెయ్యకుండా, దేశక్షేమాభివృద్ధినే ప్రధానంగా గ్రహించి, నిజ సందర్భములను గ్రహించి, ధైర్యంగా ముకర్తవ్యను ఉపక్రమించవలెను.

# ద్వితీయ యుద్ధరంగం.

## మాస్కో నగరంలో స్టాలిను-చర్చిలు సమాలోచన.

మాస్కో నగరంలో రష్యా ప్రభుత్వాధ్యక్షుడైన స్టాలినుగారున్నూ, బ్రిటిష్ ప్రధానియైన చర్చిలుగారున్నూ కలిసి దీర్ఘమైన, చాలా ముఖ్యమైన విషయాలు చర్చించారు. వీరిద్దరూ అయిరోపా ఖండములోని గొప్ప రాజకీయ నాయకులు. వీరిద్దరూ ఇదివరకెన్నడూ ముఖాముఖిగా కలిసికొని మాట్లాడియుండలేదు. వీరిద్దరూ యుద్ధ తంత్రమును ఏవిధంగా శత్రువుతో ముమ్ముందు సాగించవలెననే విషయమై చర్చించిరి. , కాని, ఏవిధమైన రాజ్యాంగ తంత్రమును సాగించవలెననిగాని, ఎటువంటి కొత్త ఒడంబడిక పత్రములను ఎవరెవరితో వ్రాసికోవలెననిగాని చర్చించలేదు. రష్యాకు అమెరికాయున్నూ, ఇంగ్లాండున్నూ యితర మిత్రరాజ్యాలున్నూ ఏవిధంగా సహాయం చెయ్యవలెననే విషయమై ఆలోచించిరి. అటు రష్యాతో జర్మనులు యుద్ధంచేస్తూ ఉండగా, ఇటు జర్మనీమీదకు పడమటివైపునుంచి బ్రిటిష్‌వారు దండెత్తి, జర్మనీని రెండు వైపులనూ ఏకకాలమందు ఏవిధంగా కొట్టవలెననే విషయమై ఆలోచించిరి. అనగా, జర్మనీని కొట్టుటకు రెండవ యుద్ధరంగం ఎటువైపున ఏవిధంగా ఎప్పుడు ప్రారంభించవలెననే విషయం చర్చించిరి. రష్యా విదేశాంగమంత్రియైన మోలటోవుగారు ఇటీవల లండనుకు, అమెరికాకు వెళ్లియుండినప్పుడు, యీ ద్వితీయ యుద్ధరంగమును 1942 వ సంవత్సరంలోనే ప్రారంభించవలెనను సంకల్పమును అధికారరీత్యా వెల్లడించియుండిరి. అటువంటి ద్వితీయ యుద్ధరంగం ప్రారంభించి శత్రువును సమర్థతతో ఎదిరించి సాధించి సంహరించుటకు తగిన దివ్యమైన తరుణం ఎప్పుడు? అనే విషయమే నిర్ణయము కావలసియున్నది.

రూటరు రాజ్యాంగ విలేఖరి యీ విషయమై యీ క్రింది విధంగా వ్రాసియున్నాడు:— "ద్వితీయ యుద్ధరంగం ప్రారంభిస్తే, తప్పకుండా జయిస్తామనే ధైర్యం అవకాశం అత్యధికంగా ఉండాలి. అత్యధికమైన సమర్థతతో దెబ్బకొట్టాలి కాబట్టి అటువంటి అవకాశం ఎప్పుడు అనే విషయమై లెక్కలు వేసికొని చూడాలి. ఆ పని ఆలస్యంగా చేయకూడదు. ఆ పని తొందరపడి చేయకూడదు. అటు తూర్పున రష్యాలోని జర్మనులను రష్యావారు పూర్తిగా యుద్ధించుచున్న సమయములో, ఇటు పడమటివైపునకూడా జర్మనులను ఏకకాలమందే పూర్తిగా యుద్ధించాలి"

ఈ ద్వితీయ రంగమును మిత్రరాజ్యాలు పట్టుదలతో ప్రారంభిస్తారనే విషయమై జర్మను ప్రభుత్వం చాలా ఆందోళన పడుచున్నది. ఈ విషయమై జర్మను పత్రికలు చర్చిస్తున్నాయి. ఈ విషయమై జర్మను ప్రజలకు తెలియజేస్తే జర్మనులు భయపడతారేమో అనే కారణంచేత ఇంతవరకూ, జర్మను ప్రచురణశాఖా మంత్రియైన గోబెల్సుగారు ఆ విషయమై పబ్లికుగా ప్రస్తావించలేదు. కాని యిప్పుడు రష్యాలో జర్మను సేనలు కొంతవరకు విజయము పొందియుండుటవల్ల, యీ ఉత్సాహ సమయంలో జర్మను ప్రజలకు ద్వితీయ యుద్ధరంగము రాబోవుచున్నదనే విషయమును చెప్పవచ్చునని గోబెల్సుగారు తలంచి ఆ విషయమై ప్రస్తావించుచున్నారు. ఇదివరలో అనగా రష్యాతో జర్మనీ విరోధం పెట్టుకున్న తర్వాత ఇంగ్లాండున్నూ, రష్యాయున్నూ ఒక ఒడంబడిక వ్రాసికొనియున్నవి. ఈ ఒడంబడిక వ్రాసికొనియుండినప్పుడే ద్వితీయ యుద్ధరంగమును బ్రిటిష్‌వారు ప్రారంభించదలంచినట్లుగా ఆలోచనలు చేయబడెనని గోబెల్సుగారు ప్రచారం చేస్తున్నారు. అది వట్టి అభూత కల్పన. ద్వితీయ యుద్ధరంగం ప్రారంభించుట చాలా సులభమైన పనిగా బ్రిటిష్‌వారు అప్పుడు తలంచిరనియు, ఇప్పుడట్టి పని చాలా కష్టసాధ్యంగా తలంచుచున్నారనియు గోబెల్సుగారు ప్రచారం చేయుచున్నారు. ద్వితీయ యుద్ధరంగమును బ్రిటిష్‌వారు ప్రారంభించినట్లయితే, దానికి జవాబు చెప్పగల్గుటకై అందుకు ప్రతిక్రియగా జర్మను ప్రభుత్వంకూడా బ్రహ్మాండమైన బందోబస్తులను చేయుచున్నదని జర్మను అధికారులు తమ ప్రజలకు ధైర్యం కలిగేటట్లుగా ప్రకటిస్తున్నారు. నిజంగా జర్మనులు బ్రహ్మాండమైన ప్రతిక్రియలను చేయుచున్నట్లయితే, వాటిని ఆవిధంగా లోకానికి వెల్లడించుకొనడం వారి యుద్ధతంత్రానికి క్షేమ

కరం కాదు. అవి వట్టి కల్లలగుటవల్లనే ఆ విధంగా ప్రకటించి జర్మను ప్రజలకు ధైర్యం కలుగజేస్తున్నారు. కాని, ఆవిధంగా ప్రకటించుటవల్ల జర్మనులకు మరింత ఆందోళన ఎక్కువగునేగాని, ధైర్యం కలుగదు.

జర్మనులు చేసే బందోబస్తులు మాగినాటు లైను వంటివే.

ఫ్రాన్సులో "మాగినాటులైను" అనబడే అభేద్యమైన దుర్గశ్రేణి యొకటి జర్మనీకి-ఫ్రాన్సుకు సరిహద్దులో నిర్మింపబడింది. ఆ దుర్గశ్రేణిని భేదించుకొని జర్మనులు ఫ్రాన్సులోనికి రాజాలరని ఫ్రెంచివారు ధైర్యంతో ఉండిరి. కాని, ఆఖరుకు ఆ మాగినాటులైనును భేదించనవసరంలేకుండానే జర్మనులు ఫ్రాన్సులో ప్రవేశించారు. ఇప్పుడు జర్మనులు ద్వితీయ రంగం కొరకై చేసే బందోబస్తులన్నియు మాగినాటు లైను నిర్మాణంవంటివే యని ఒక ఫ్రెంచి ఇంజనీరు అన్నాడు. ద్వితీయ యుద్ధరంగం ప్రారంభిస్తే అది చాలా కష్టనష్టములతో కూడిన పని యని మిత్రమండలికి తెలియును. కాని, అట్టి ద్వితీయ రంగంవల్లనే జర్మనీని చిక్కులపాలు జేసి, అడకత్తెరలో పోకచక్కను నొక్కినట్లుగా నొక్కవలెననియే బ్రిటిష్‌వారి సంకల్పము. ద్వితీయ యుద్ధరంగమును ప్రారంభిస్తే అటు రష్యాకు యుద్ధ సామగ్రులను సప్లయిచేస్తూ, ఇటు అమెరికను సేనలకు బ్రిటిష్ సేనలకు కూడా ద్వితీయ రంగంలో కావలసిన యుద్ధ సామగ్రులను సమృద్ధిగా సప్లయి చెయ్యాలి. ఈ యుద్ధ సామగ్రి సప్లయిలకు సంబంధించిన లెక్కవివరములనుగూర్చి మాస్కో నగరంలో స్టాలినుగారున్నూ, చర్చిలుగారున్నూ కలిసి చర్చించారు. చర్చిలుగారు మాస్కోనుంచి తిరిగి లండను చేరిన పిమ్మట, స్టాలినుగారికి చర్చిలుగారు యీ క్రింది రీతిగా తంతివార్త పంపిరి :—"మన సంకల్పమును కొనసాగించుటకై మన ఉభయులకూ జరిగిన సంభాషణలు ఎక్కువగా అక్కరకు రాగలవు. అందువల్ల నేను మాస్కో నగరమునకు వచ్చి మీతో మాట్లాడగలిగినందుకు సంతోషించుచున్నాను" అని అభినందిస్తూ తంతివార్తను పంపిరి.

# అంటువ్యాధిని వ్యాపింప జేయుచున్నావా ?

దేశంలో ఒక భయంకరమైన జబ్బు వున్నది.
అది మానవుని మనస్సును చెడగొట్టి అధైర్యవంతునిగా చేస్తుంది.
ఆ జబ్బే 'పుకారు' అందరికి శత్రువైన జపానే దానిని పుట్టించుచున్నది.
మీ స్నేహితులకు సోకునట్లుగా అట్టిదానిని వ్యాపింపజేయకుడు.

* పుకారుల నమ్మకుడు. *

జపానును ఎదుర్కొనుటకు దేశీయ యుద్ధ రంగమును తయారుచేయుడు.

మాస్కో సభలో భారతదేశ ప్రసక్తి.

చర్చిలుగారు మార్గ మధ్యములో ఈజిప్టుకు ముఖ్య పట్టణమైన కెయిరో నగరంలో దిగినప్పుడు, బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వాధ్యక్షుడైన స్మట్సుగారు కెయిరో నగరానికి వచ్చి చర్చిలుగారితో మాట్లాడిరి. అటుపిమ్మట మాస్కో నగరంలో సమాలోచనలు జరిగినవి. "ఈ రెండు సంభాషణలవల్లను యుద్ధతంత్రము చాలా అమోఘంగా సాగింపబడగలదు" అని ఫీల్డు మార్షలు స్మట్సుగారు అన్నారు. పంజాబు రాష్ట్ర ప్రధాన మంత్రియైన సర్ సికందరు హయతుఖానుగా రిప్పుడు యీజిప్టులోనున్న భారతీయ సైన్యములను సందర్శించుచున్నారు. హయతుఖానుగారుకూడా చర్చిలుగారిని అచట కలిసికొని మాట్లాడియుండిరి. భారతదేశంలో సర్వసేనాధిపతిగానున్న జనరలు వావెలుగారు కూడా మాస్కో నగరానికి వెళ్లి అక్కడ జరిగిన సమాలోచనలయందు పాల్గొనియున్నారు. రష్యాలోని కాకససులోనికి జర్మనులు ఇంకా ముందుకు చొచ్చుకొని వచ్చే సమయంలో అచట జర్మను సేనలను ఎదురొడ్డుటను గూర్చియు, ద్వితీయ యుద్ధరంగమునకు సంబంధించిన కొన్ని ముఖ్య ప్రాంతములను, ఆయువుపట్టులనుగూర్చియు వావెలు సేనాని అచట చర్చించియుండెనని యూహించుచున్నారు.

# రష్యాలోని కిరసనాయిలు గనులకై యుద్ధము.

రష్యాలో జరుగుచున్న యుద్ధమును సరిగా అర్థము చేసుకోవలెనంటే, కొన్ని ముఖ్య విషయములను ముందుగా గ్రహించవలెను. రష్యను సేనలు గత మూడు మాసములనుండియు ఎడతెగకుండా విధివిరామంలేకుండా యుద్ధము చేస్తున్నాయి. అంత మొండిపట్టుదలతో రష్యనులు పోరాడుచుండుటవల్లనే, జెర్మను సేనలు కొంతవరకు కొన్నిచోట్ల ముందుకు సాగకుండా అడ్డగింపబడినవి. వారొనెజ్‌వద్ద జర్మనులు ముందుకు చొచ్చుకొని రాలేకపోయిరి. మాస్కోనగరమును వెనుక వైపునుండి ముట్టడించుటకు ప్రయత్నింపలేక పోయిరి. రష్యను సైన్యములను భిన్నభిన్నములుగా చీల గొట్టుటకు జర్మనులకు సాధ్యం కాలేదు. రష్యాలో యుద్ధం వేగంగా ముగించవలెనని జర్మనులు కోరినప్పటికీ, ఆ కోరిక నెరవేరలేదు.

డాన్ నదికి యీవలి ఒడ్డున, ఆవలి యొడ్డున కూడా యుద్ధం జరుగుచున్నది. రాస్టావుమీదుగానే జర్మను సేనలు ఎక్కువగా సాగుచున్నవి. రాస్టావునుండి కాస్పియను సముద్రతీరమునకు ఒక రైలు మార్గము పోవుచున్నది. ఆ రైలు మార్గము రాస్టావునుండి కిహోరెస్కు మీదుగా, ఆర్మవీరుకు పోవుచున్నది. కిహోరెస్కునుండి ఒక చిన్న రైలుశాఖ క్రాస్నొడారుకు పోవుచున్నది. కిరసనాయిలును శుద్ధిచేసే ఫ్యాక్టరీలు క్రాస్నొడారులో కలవు. ఆర్మవీరువద్దకూడా అటువంటి ఫ్యాక్టరీలు కలవు. ఆ శాఖా రైలు మార్గము మైకోపువద్దకు పోవుచున్నది. మైకోపువద్ద పెద్ద కిరసనాయిలు గనులు కలవు, ఈ గనులలోనుండి సంవత్సరమునకు 10 లక్షల టన్నుల కిరసనాయిలు చొప్పున తీయబడుచున్నది. ఆర్మవీరునుంచి కాస్పియను సముద్రతీరమునకు పోయే రైలు మార్గముమీద గ్రాజ్నీ అను పట్టణము కలదు. ఇచటకూడ పెద్ద కిరసనాయిలు గనులు కలవు. ఇంకను యీ రైలు మార్గమువెంట ఆగ్నేయముగా పోయినయెడల, బాకూ అను పట్టణము కలదు. అచట బ్రహ్మాండమైన కిరసనాయిలు గనులు కలవు. అది కాస్పియను సముద్రతీరమున ఉన్నది. ఆ కిరసనాయిలు గనులలోనుంచి సంవత్సరమునకు 2 కోట్ల టన్నులు, లేదా 2½ కోట్ల టన్నుల కిరసనాయిలు లభించుచున్నది.

బాకూవద్దకు జర్మను సేనలు ఇప్పుడు వెంటనే చేరుట సాధ్యమైనపనికాదు. వారు దాటిపోవలసిన ప్రాంతం చాలా కష్టసాధ్యమైన కొండలమయమైన దేశము. కనుక ప్రస్తుతం జర్మనులు మైకోపులోని కిరసనాయిలు గనులను, గ్రాజినీ వద్దనున్న కిరసనాయిలు గనులను మాత్రం ఆక్రమించుకోగలరు. కాని, ఆ గనులను రష్యనులు చాలావరకు ధ్వంసంచేసి, శత్రువులకు వెంటనే అక్కరకు రాకుండా చేశారు. తిరిగి ఆ గనులను మరమ్మతు చేసికొని భుక్తపరచుకొనుటకు జర్మనులకు 6 నెలల కాలము పట్టును. ప్రస్తుతం వారు అచటి గనులలోని మడ్డి కిరసనాయిలును నల్ల సముద్రం మీదుగా రుమేనియాకు రవాణాచేసి అక్కడి యంత్రాగారములలో శుద్ధి చేసికోవలెను. ముందుకు ఇచటి కిరసనాయిలు కూడా తమకు ఎంతవరకు అక్కరకు రాగలదో ప్రస్తుతం జర్మనులు లెక్కవేసికొని తమ ఖర్చుకు తగిన అంచనాలు మాత్రము వేసికొనగలరు.

### జర్మనుల ముఖ్య లక్ష్యము.

జర్మనులు ఇప్పుడు ముఖ్యంగా రష్యాలో చేయుచున్న యుద్ధంవల్ల వెంటనే సాధింపదలంచిన ఘనకార్యం ఏమిటంటే, ఆ ప్రాతంలోఉన్న రైలు మార్గములను భేదించి, రష్యనులకు అక్కరకు రాకుండా చేసి, ఆ రైలు మార్గములను తాము వశపరచుకోవలెనని ప్రయత్నించుచున్నారు. ఈ రైలు మార్గములను జర్మనులు పట్టుకొనుటవల్ల జర్మనులకు లాభించేది లేకపోయినా, రష్యనులకు మాత్రము నష్టము ఎక్కువగా కలుగగలదు. (1) క్రాస్నడారునుండి స్టాలినుగ్రాడువరకు పోయే రైలు మార్గమును మధ్యలో సాల్స్కువద్ద జర్మనులు భేదించి వశపరచుకొన్నారు. (2) వాల్గా నది నావల రాకపోకలకు వీలైన మార్గము. ఈ నదీ మార్గమును జర్మనులు తమ విమానదాడులవల్ల చాలావరకు చెడగొట్టినారు. (3) కాస్పియను సముద్రములోని ఉత్తర ప్రాంతంలో యూరల్ నదీ ముఖద్వారం కలదు. అచట చాపేయెల్ అను రేవు పట్టణం కలదు. ఆ రేవు

ప్రదేశాన్నికూడా నిరంతర విమానదాడులవల్ల జర్మనులు చాలా భీభత్సం చేసినారు.

పైజెప్పిన రహదారీ మార్గములలో రెండవది, అనగా, వాల్గా నదీ మార్గము శత్రు వశమైనయెడల, కాకసను పరగణాలోని రష్యను సేనకు రష్యాలోని ఏయితర ప్రాంతమునుండియు సప్లయిలు రాజాలవు. కాని, అచట చిక్కుపడియుండే రష్యను సేన అచటిగ్రామాలలో లభించే సరకు సామగ్రులనే ఉపయోగించుకొనుచూ పోరాడవలెను. ఇటువంటి చిక్కు పరిస్థితి ఏర్పడగలదని ఊహించి రష్యనులు ఆ ప్రాంతంలోని సైన్యానికి కావలసిన సామగ్రుల నన్నింటిని ముందుగా అచటనే నిల్వచేసి యుంచినారు. కాకేసియా ద్వారా రష్యాకు ఆయుధ సామగ్రులను అమెరికాయున్నూ ఇంగ్లాండున్నూ సప్లయి చేయుచున్నవి. అనగా, పరిషియాలోనుంచి కాకసను ప్రాంతములోనికి పంపగల్గుచున్నారు. కాని, ఇప్పు డామార్గముగుండా పంపుటకు సాధ్యము కాదు. అదిన్నీ గాక, అమెరికానుండి పరిషియాకు ఆయుధ సామగ్రులను తీసికొనివచ్చే నావలు చాలా దూరప్రయాణం చేయవలసినవైయున్నవి. ఇంత దూరప్రయాణంవల్ల విశేష కాలహరణమగును. ఇది విశేషమైన ఖర్చుతో కూడిన దూరప్రయాణం. కనుక యీ మార్గముగుండా రష్యాకు మిత్ర రాజ్యాలవారు సప్లయిలు పంపుటకంటె ఉత్తర ధృవ సముద్రం మీదుగా పంపవలసియున్నది. ఈ సముద్ర మార్గము నావలకు చాలా ప్రమాదకరమైనది. శత్రువులచే అనేక నావలు త్రోవలో ముంచివేయబడవచ్చును. ఆ మార్గము ఎంత కష్టసాధ్యమైనను, ఎంత ప్రమాదకరమైనను లక్ష్యంచేయక రష్యాకు మిత్ర రాజ్యాలవారు యుద్ధ సామగ్రులను సాహసించి సప్లయిచేయక తప్పదు. మిత్ర రాజ్యాలవారు యీ బాధ్యతను వహించి రష్యాకు సహాయము చేయవలసియున్నారు.

---

# "జపానువారిసంగతి నేను గ్రహించాను"

జపానువారి సామ్రాజ్యాధికారం ఎటువంటిదో వారి దేశాలలో స్వయంగా అనేక సంవత్సరాలు ఉండి అనుభవించి, వారు లోకానికి చెప్పే శ్రీరంగనీతులకూ, వారు చేసే చర్యలకూ ఎంత వ్యత్యాసం ఉన్నదో కన్నులార చూచినటువంటి ఒక ప్రముఖుడు "యుద్ధ సంచిక"కు ప్రత్యేకంగా యీ వ్యాసము వ్రాసి పంపినాడు.

జపానువారు అధికారం చలాయించుచున్న రాజ్యాలలో నేను అనేక సంవత్సరాలు ఉన్నాను. అయిరోపా ఖండంలోఉన్న జపానువారిని, ఇతర దేశాలలో ఉన్న జపానువారినికూడా నేను స్వయంగా చిరపరిచయంవల్ల ఎరిగి ఉన్నాను. హాంకాంగులోను, ఫిలిప్పయిను దీవులలోను, ఫ్రెంచి ఇండో చైనాలోను,—(అవి జపానువారిచే ఆక్రమింపబడక పూర్వమున్నూ ఆక్రమింపబడిన పిమ్మటనుకూడా) నేను అచటి జపానువారిని ఎరుగుదును. డచ్చి యీస్టు ఇండీసు దీవులలోను సింగపూరులోనుకూడా జపానువారిని నేను చూచాను. చైనాలో వారిప్పుడు ఆక్రమించిన ప్రాంతంలోను, షాంగై నగరమును వారు వశపరచుకొన్న పిమ్మటను అచట జపానువారు ఏ విధంగా సంచరిస్తున్నారో నేను స్వయంగా చూచినాను.

చైనామీద జపానువారు బాహాటంగా యుద్ధం ప్రకటించకుండానే చైనాతో పోరాటం ప్రారంభించారు. ఒకమూల చైనావారికీ, జపానువారికీ తీవ్రంగా యుద్ధం జరుగుతూనే ఉన్నది. అయినప్పటికీ, చైనాలోని షాంగై నగరంలో ఉన్న జపానువారున్నూ, చైనావారున్నూ పైకి అన్యోన్యంగానే తగవులులేకుండా కలిసి తిరుగుతూ ఉండేవారు. షాంగై నగరంలో ఒక పేట ఫ్రెంచివారిది. ఒకపేట బ్రిటిష్‌వారిది. షాంగై నగరంలో యీ రెండు పేటలు కాకుండా చైనా ప్రభు

త్వానికి లోబడియున్న భాగంకూడా ఉన్నది. కాని, యూరోపియనులు నివసించుచున్న పేటల లోని చైనా ప్రజలను జపాను సైనికులు అనేక విధాలుగా హింసించేవారు. బాంబులు చాటుమా టుగా వేసేవారు. దొంగచాటుగావచ్చి హత్యలు చేసేవారు. మనుష్యులను ఎత్తుకొని పోయేవారు. ఈ షాంగై నగరంలోని అంతర్జాతీయ మకాము లగు యూరోపియను పేటలలో అమెరికనులు, రష్యనులు, భారతీయులు, ఫ్రెంచివారు, ఇంగ్లీషు వారు అందరూ ఉండేవారు. ఇచటి జనాన్ని హింసించుచున్న జపాను సైనికుల కుతంత్రము లను సాగనీయకుండా భగ్నం చేయుటకొరకై ఒక రహస్య సంఘం ఏర్పాటు చేయబడినది. ఆ సంఘంలో నేనుకూడా మెంబరుగా చేరియుంటిని. ఈ సంఘంలో ఒకరిద్దరు తప్ప మిగిలిన మెంబ ర్లందరూ చైనావారే. జపానువారియెడల నాకు ద్వేషం ఉండుటచేత నేనీ రహస్య సంఘంలో మెంబరుగా చేరలేదు. కొన్ని సాహసకార్యాలు చేయవలెననే ఉత్సాహంతో యీ రహస్య సంఘం లో చేరినాను. ఆ సంఘంలో చేరి ఒక సంవ త్సరం పనిచేసాను. ఆ రోజులలో, జపాను సైనికాధికారులు, ఎన్నెన్ని కుతంత్రాలు చేయుచు న్నారో గ్రహించగలిగితిని. పైకి మామూలు వ్యవ హారాలు మాట్లాడేటప్పుడు జపానువాడు ఎంత తియ్యగా మాట్లాడునో, పోరాటంలోకి వచ్చేసరికి, అంత క్రూర మృగంలాగున పోట్లాడుతాడు. గోముఖ వ్యాఘ్రం అంటే జపానువాడే. "ఆసి యాఖండ వాసులను ఉద్ధరించుటకే ఉద్భవిం చాము" అని లోకానికి ప్రకటించుచున్న జపాను వాళ్ల దుర్మార్గములన్నీ నేను కండ్లార చూచినాను. నేను జపానులోను, జపానువాళ్ల రాజ్యాలలోను 15 సంవత్సరాలు ఉన్నాను. షాంగైలో ఒక సంవత్సరం ఉన్న తర్వాత నేను హాంకాంగు నగరమునకు వచ్చాను. ఒక వార్తా పత్రికా కార్యాలయంలో పనిచేస్తూ ఉన్నాను. అటు పిమ్మట ఆ పత్రికకు యుద్ధరంగ వార్తలను పంపించేటటువంటి విలేఖరిగా తిరిగి చైనా యుద్ధ రంగ ప్రాంతాలకు వెళ్లితిని. జపానువాళ్లు చేసిన దుర్మార్గాలు వర్ణించాలంటే, నేను కండ్లార చూచి నవే ఎన్నో ఉన్నాయి. కొన్నింటిని మాత్రం వివరిస్తాను.

కాంటను నగరంలోనికి జపానువారు ప్రవే శించినప్పుడు నేను అక్కడనే ఉన్నాను. ఆ నగరం వెలుపలఉన్న ప్రాకార దుర్గములను శత్రువు భేదించగానే, ఆ నగరం శత్రువునకు వశమైనట్లే. ఆ నగరంలోనికి శత్రువు నిరాటం కంగా, నిదానంగా, నిర్భయంగా, నిరాయుధంగా కూడా ప్రవేశించవచ్చును. నగరంలో శత్రువును ఎదిరించి పోరాడేవాళ్లు ఎవ్వరూలేరు. కాని, ఆ నగరంలోనికి జపానువాళ్లు ప్రవేశించి వారాల కొలదిగా లూటీలు చేస్తూనేఉన్నారు. నిరాయుధు లైన జనాన్ని నరికివేస్తూనే ఉన్నారు. స్త్రీలను మానభంగంచేసి ఘోరంగా హింసిస్తూనే ఉన్నా రు. యుద్ధ సమయంలో వీరావేశంచేత ఎన్ని ఘాతుక కృత్యాలైనా ఉభయ పక్షాలవారు చేస్తా రంటే నమ్మగలము. కాని, ప్రశాంతమైన నగ రంలో ప్రవేశించి జపాను సైనికులు అనవసర మైన అనేక ఘోర కార్యాలుచేసారు. నేను కండ్లార చూచియున్నాను.

నాంకింగు నగరాన్ని జపానువాళ్లు ఆక్రమిం చారు. అది నిరాక్షేపణగా వారి స్వాధీనమైపోయిన ఆరు మాసాలకు ఆ నగరంలో జపాను సైని కులుచేసిన పనిచూడండి. పహరా తిరిగేటటు వంటి ఒక జపాను సైనికుడు ఎదురైనప్పుడు, అతనికి ఒక చైనా దుకాణాదారు నమస్కారం చెయ్యలేదు. అందువల్ల ఆ చైనావానికి గుడ్డలు ఊడతీసి, తలక్రిందుగా ఒక ముక్కోణముమీద అంటగట్టినారు. వాని భార్యను, వాని ముగ్గురు పిల్లలను తీసికొనివచ్చారు. వాని పెద్ద కుమా రుని చేతికి బాగా కాగి వేడెక్కిన తారు ఒక పెద్ద పాత్రలోపోసియిచ్చిముక్కోణంమీదనున్న తండ్రి మీద పోయవలసినదిగా ఆజ్ఞాపించారు. వెనుక నుంచీ తుపాకీ మొనకత్తులతో కుమారుని పొడిచి

"పోస్తావా లేదా ?" అని బాధించారు. తన తండ్రి పడుచున్న బాధను ఆ కుమారుడుచూచి సహించలేక క్రింద పడిపోయినాడు. ఆ కుర్ర వానిని జపాను సైనికులు కత్తులతో పొడిచి చంపి వేసారు. ఆ దుకాణాదారుని భార్యను జపాను సైనికులు తమ వెంట తమ సైనిక మకాము లకు తీసికొనిపోయినారు. ఆమెను ఎటువంటి ఘోర కార్యముల పాలుచేసిరో నేను చెప్పనక్క రలేదు. మీరే ఊహించుకోగలరు.

మరొక ఘోర రాక్షసదృశ్యం. ఇది హాంకో నగరంలో జరిగింది. ఒక మైదానంమీద పట్ట పగలు జరిగింది. జపాను సైనికులు వలయంగా చుట్టూ నిలువబడియున్నారు. వారి మధ్యను "జార్జి యీ" అనే చైనావాడు అమెరికాలోని హార్వార్డు నగరంలో చదివిన 32 సంIIల వయ స్సువాడు. అతడు ఆటలలో మంచి సమర్థుడని పేరు పొందినవాడు. హాంకాంగు నగరంలోను షాంగై నగరంలోను గొప్ప హోదాలో గౌర వంగా జీవించుచున్నవాడు. అతని నొక చెట్టుకు బిగించి కట్టిరి. అతని ముఖం రక్తపు ముద్దగా ఉంది. అతనిఎదుట అతని భార్యను నిలువ బెట్టినారు. ఆమె చుట్టు నిలువబడియున్న జపాను సైనికులు ఆమెను బలాత్కారంగా, ఒక సోల్జరు అయిన తర్వాత ఇంకొక సోల్జరు, ఘోరంగా మానభంగం చేశారు. మధ్య మధ్య ఆమెకు స్పృహ తప్పిపోవుచుండగా, మంచుగడ్డ నీళ్లు ఆమె ముఖంమీద జల్లుతున్నారు. ఆమె ఆఖ రుకు అక్కడనే ప్రాణాలు విడిచింది. ఆమె భర్త మరణించిన పిమ్మట ఆమె మరణించింది. కర్నలు హై మెకావా అను జపాను సైనికాధి కారి తాను దగ్గరఉండి ఆ సైనికులచేత యీ పని చేయించాడు. చాలామంది చైనా ప్రజలు అచట నిలువబడి చూచుచుండగా, యీ పని చేశారు. విదేశ పత్రికల ప్రతినిధులుకూడా కొందరు, ఆహ్వానింపబడకపోయినను, అచట నిలువబడి యుండిరి. ఈ విధంగా ఆ చైనా వానిని, అతని భార్యను హింసించుటకుగల కారణములను, ఆ జపాను సైనికాధికారి అక్కడ ఉన్నవారికి విశద పరచినాడు. ఆ చైనావాని యింటిలోనికి జపాను సైనికులు ప్రవేశించారట. అతని భార్యను చెయ్యి పట్టుకొని ఆ సైనికులు బలాత్కారంగా లాగినా రట. అందుకు ఆ చైనీయుడు ఆగ్రహించి నాడట. "పాడు పాశ్చాత్య విద్యను ఏ అమె రికాలోనో చదివివచ్చిన యీ చైనావాడు ఇంత గర్వంతో మిడిసిపడుచున్నందుకు వానికి బుద్ధి వచ్చేటట్లుగా యీ పని చేస్తున్నాము" అని ఆ జపాను సైనికాధికారి తానుచేసిన పనికిగల కార ణం వివరించి చెప్పెను.

షాంగైలో ఒక తోట వంతెనవద్ద కాపలా కాయుచున్న జపాను పహరా సైనికుడు, కేవలం పొగరుబోతుతనంచేత, గర్భిణియైయున్న ఒక స్త్రీని కడుపుమీద తన్నెను. ఆమె క్రింద పడి పోయింది. ప్రక్కనున్న రేవులో ఒక బ్రిటిష్ స్టీమరులోని ఇంజనీరు ఇది చూచినాడు. ఆ స్త్రీని ఆ జపాను సైనికుడు తిరిగి తన్నబోవుచుండగా, తన తుపాకీతోవచ్చి ఆ జపాను సైనికుని చావ గొట్టి నదిలో పారవేసెను. వెంటనే రెండు నిమిషములకు పిమ్మట, యీ ఆంగ్లేయుని తల యంతయును జపాను సైనికులు తుపాకులతో చితుకగొట్టిరి. అతని కడుపు చీల్చి వేయ బడెను. ఈ ఘోరకార్యం జరిగిననాటికి యింకా, జపానువారు బ్రిటిష్‌వారిమీద యుద్ధం ప్రకటించి యుండలేదు. తాముచేసిన పనులకు ఇంకా, "మా సైనికులవల్ల పొరబాటుపని జరిగింది. అందుకు మాకు చాలా విచారంగాఉంది" అని సమాధానాలు చెప్పుతూనే ఉన్నారు. జపాను సైనికులు ఇటువంటి పని చెయ్యడానికి తగిన సందర్భకారణం చూపించుటకొరకై, అక్కడ హాజరుగాఉన్న జపాను సైనికాధికారి, తన తుపాకీని బారుచేసి ఇద్దరు జపాను సైనికులను కాల్చెను. వారిలో ఒకడు మరణించెను. ఇంకొ కడు గాయపడెను. అంతట జపాను అధికా రులు సృష్టిచేసిన కథ ఏమిటంటే, ఆ బ్రిటిష్ నావికుడు వీరావేశంపుట్టి అనవసరంగా జపాను

సైనికులమీద తుపాకీ కాల్చినందువల్ల జపాను సైనికులు తిరిగి పగ సాధించుటకు ఆ పనిచేశారన్నాడు. ఆ జపాను సోల్జర్లవద్దఉన్న తుపాకులనే ఆ బ్రిటిష్ నావికుడు లాగుకొని వారి తుపాకులతోనే వారిని కాల్చినాడట ! చూడండి ! వారు అధికారరీత్యా ప్రకటించిన సమాధానం ఇది!

కాంటను నగరంలో మంచికుటుంబాలకు చెందినటువంటి పడుచు ఆడపిల్లలను ఒక పెద్ద రాజబాటమీద గుడ్డలువిప్పి నృత్యం చేయవలసినదని జపాను సైనికులు తుపాకీ మొనకత్తులతో వారిని పోట్లుపొడిచి నృత్యం చేయించారు. ఇది నేను కన్నులార చూచినాను. ఒక పిల్ల ఆ రీతిగా నృత్యంచేయుటకు నిరాకరించినందున ఒక వెదురు కర్రతో ఆమెను కడుపులో పొడిచి ప్రేగులు బయటకు లాగివేశారు.

చాంగ్షాను అనే పట్టణంలో 60 మంది చైనా వాళ్లచేత జపాను సైనికులు దగ్గరఉండి గోతులు త్రవ్వించారు. అటు పిమ్మట ఆ చైనావాళ్లకు కర్రలు చేతికిచ్చి వారిలో వారిని కొట్టుకోవలసినదని ఆజ్ఞాపించారు. వారు బాగా కొట్టుకొనుచుండే సమయంలో, వారిమీదకు జపాను సైనికుల కాల్బలమొకటి దండెత్తి వచ్చి వారితో కలియబడి తుపాకికత్తులతో పొడిచి యుద్ధం సాగించింది. ఇదంతా జపాను సైనికులు శత్రువుమీద యుద్ధం చేయుటకై సాధకంచేసే నిమిత్తం ఏర్పాటుచేసిన ఒక నాటకరంగంవంటిది. ఈ యుద్ధ సాధకం అంతా అయిపోయిన తర్వాత, ఆ చైనావారిలో ప్రాణాలతో మిగిలియున్న వారినికూడా, ఆ గోతులలో పడద్రోసి పూడ్చిపెట్టిరి.

హాంకాంగు నగరంలో బ్రిటిష్ సోల్జరుల యెడల జపాను సోల్జర్లుచేసిన ఘోర కార్యములను ఇంగ్లాండు ప్రభుత్వమువారు అధికారరీత్యా ప్రకటించియుండిరి. ఆ ప్రకటనలో వివరింపబడిన ఘోర కార్యాలన్నీ నిజంగా జరిగినవేనా ? అని కొందరు నన్ను అడిగినారు. కాని అవి అన్నియును నిజమని నేను చెప్పగలను.

కనుక, జపానువాళ్లు భారతదేశమునకువచ్చినట్లయితే, భారతదేశాన్ని జయించి ఆక్రమించినట్లయితే, అటువంటి పనులు ఇండియాలో చెయ్యరా ? జపానువాళ్లను ఇండియాకు రానిస్తే ప్రమాదంలేదనే భ్రమలో ఎవరైనా భారతీయులు ఉన్నట్లయితే, నేను వారికి చెప్పేది ఒక్కటే మాట. నేనుచూచిన ఘోర దృశ్యాలు మీరుకూడా చూచినట్లయితే, ఆ విధంగా భ్రమించరు.




జపానువారు స్వాధీనం చేసికొనిన చైనాలోని వ్యాపార ప్రపంచంలో చిన్న పెద్ద అనే తారతమ్యం లేకుండ చైనావారిని జపానువారు ఉద్యోగములనుంచి తొలగించారు. ఇప్పుడు చైనాలో చీనావారి పారిశ్రామికదారులు లేరు. చైనా షాపులూ లేవు. ఉద్యోగాల్లో చైనావారు లేరు. గుమాస్తాలు లేరు. సైపుచేయువారు లేరు. తుట్టతుదకు బజార్ల వెంబడి తిరిగి అమ్ముకొని జీవించే చైనావారుగూడ లేరు. ఇవన్నియు జపానువారి స్వాధీనమైయున్నవి. ఇవి వారికియుద్ధ ప్రతిఫలములు. జపానువారు వచ్చినప్పుడు ఇదే జరుగుతుంది.

ఇది ఇండియాలో జరుగువరకు నీవు చూస్తూ ఊరుకొనవద్దు. మన రక్షణశక్తిని బలపరచుకొని మన గెలుపు నిశ్చయమగువరకు ప్రతివ్యక్తియొక్క (స్త్రీగాని పురుషుడుగాని) సహాయ్యము చేయవలసియున్నది.

జపానువారి నెదుర్కొనుటకై దేశీయ యుద్ధ రంగమును తయారు చేయుడు.



## మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రిందిరీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

పోరాడు సైనికులు కానివారు,

ఇతర హెూదాలవారు.

మరణించినవారు.

| నెంబరు. | హెూదా. | పేరు. |
| --- | --- | --- |
| మద్రాసు సాపర్లు, మైనర్లు— | | |
| 63660 | సాపరు ... | రామయ్య. |
| ఆర్.ఐ.వి.యస్ సి.— | | |
| యం.టి./ 943278 | సిపాయి ... | రాజారాం. |
| ఐ.వి.ఓ.సి.— | | |
| ఓ/76502 | సిపాయి, డ్రయివరు. | మురుగన్. |